లక్ష్మీరాదేవంటే ఆశ్చర్యమేముంది? కొంతకాలం గత రైతుసోదరులు కండ్లు మూసుకుంటే, తాలూకా బోర్డు అధ్యక్షుడు తహశీలుదారు, జిల్లాబోర్డు అధ్యక్షుడు దివానుగారు శాసన సభలకు పోటీచేయుడేగు రాజాగారు కా క మా న రా రా యిప్పటికంటే అధ్వాన్నంగా.

* * *

వెంకటగిరి పబ్లిక్‌ప్రాసిక్యూటరుగారు (ఎలెక్షన్ ఆఫీసరు) మొన్నటి నామినేషనప్పుడు రైతుపక్ష నిలిచిన అభ్యర్థియగు శ్రీ యాయ పెంచెలు "ఓరు పూరు పెంచలు" అనియుచ్చారణభేదముతో వ్రాలు చేసినంత మాత్రమున ఆనామినేషను కొట్టివేయుటయు, జమీందారు పక్షమువారు "మహమ్మద్ ఖాజాద స్త్రిగి" అనియుండగా "ఖాజాద స్త్రిగి" యని వ్రాలుచేయగా ఎదుటివారు ఆక్షేపించినను అంగీకరించడం వైవారికినూడా ఆశ్చర్యంగానే యుంది. పెంచెలు జిల్లాకోర్టులో గత 29 తేది కేసు వేశాడట. చూద్దాం యేమవుతుందో?

* * *

కుమారరాజాగారు సిద్దాగుంట సర్కిల్లో, దర్శిసర్కిల్లోనూడా జిల్లాబోర్డుకు పోటీచేస్తున్నాడు. ఒకచోట వెంకటగిరి జమీన్‌రైతు సంఘాధ్యక్షుడు మరియొకచోట వెంకటగిరితాలూకా రైతు సంఘాధ్యక్షుడు పోటీదార్లుగానున్నారు. రైతుల్లో వ్యక్తిత్వంవుంటే రెండుచెండే! లేకపోతే రెండు రెండే! యీకీర్తి అపకీర్తులు రైతులివేగా?

దర్శి, పొదిలి, కరణాలచేతుల్లోనేగా రైతుల ప్రాణాలుండేది. వారెట్లాతెపితే అట్లా. ఇంతకు కరణాలు గమనించాల్సింది ఒకటుంది, తమదౌర్భాగ్యపు కడుపుకోసం రైతుల గొంతులునొక్కి వాళ్ళఓట్లు జమీందారుకు కట్టిపెట్టడం నీతిబాహ్యమనిగమనిస్తే చాలు!

---

## పండుగ లెప్పుడు?

భోగిపండుగ జనవరి తే 12 ది. ఉత్తరాయణ పుణ్యకాలము తే 13 ది రాత్రి వచ్చుచున్నది గాన తర్పణాలు వగైరాలు ఆ తేది జరుగుటకు వీలు లేదుగాన మకర సంక్రాంతి (పెద్దపండుగ) జనవరి 14 తేదిగా నిర్ణయించబడినది. తర్పణాలు మొదలగునవి 14 తేది జరుగవలసినదేను.

మొదలి రామకృష్ణసిద్ధాంతి.

నెల్లూరు.

## వోటర్లకొకమనవి

---

పోలవరపు రామబ్రహ్మంగారు.

న్యాయవాది.

ఎన్నికలు సమీపించుచున్నవి. ప్రతిసంస్థ యందును చొచ్చుటకు జమీందారులు విశ్వప్రయత్నములొనర్చుచున్నారు. తమసంస్థాన పరిపాలనమును మంటగలిపి, అప్రతిరోజకులును, అసమర్థులనగు క్రింది అధికార్లచేతులందమ ప్రాభవమును ధారవోసి గౌరవశూన్యములయిన మెంబరుపదవులకై ప్రాకులాడుచున్న జమీందార్లగాంచిన జాలియు సేవగింపును కలుగుచున్నది. ప్రజలహక్కులను, ప్రాణధనములను, పీల్చిపిప్పి యొనర్చి నశింపజేయుచున్న వీరు ప్రజాప్రతినిధులమని స్థానిక సంస్థలందును, శాసన నిర్మాణసభలయందును యేముఖముతో కూర్చొనెదరో తోచకున్నది. ధనము, అధికారము చేతులందున్నవిగదాయని వోట్ల కొరకయి కృత్రిమముగ రైతుల కష్టార్జితమును మంటిపాలొనర్చు జమీందారులా మనకు ప్రతినిధులు? తమకేక లాభమునకయి నిరుపేదలగు రైతులు జమీందారుల కృత్రిమ వాగ్దానములకు మోసపోకుందురుగాక! తమసంస్థానము నేచక్కగ పరిపాలించుకొన జాలని వీరికే నిస్సారములగు పదవులెందులకో? ధనమును వెచ్చించి సంపాదించిన పదవి వీరికంతటి గౌరవము నొసగునో యూహించుకొనుటలేదు. ప్రజల విశ్వాసగౌరవమును గోల్పోయిన యీ ప్రభువులు ప్రజాయత్త సంస్థలందు, ప్రజాప్రతినిధులమని కూర్చొనుట కించుకేని స్వాభిమానములేదా? రైతుల నింకను శృంఖలా బద్ధుల నొనర్చుటకేగదా వీరి యారాటము? కానుకుగొరగాని వీరి యిమిటేషన్ తాహసీల్దార్లు, సిరస్తార్లు, ముసద్దీలు, పేష్కార్లు, నెల జీతములులేక గ్రామములపయిబడి కాట్లకుక్కలవలె పేదరయితుల రక్తమును పానమొనరింపుచుండ, జలాధారములు మంటగలసి యన్నమోరామచంద్రాయని వీరిప్రజలు అల్లాడుచుండ, అదరించి బెదరించి, సంపాదించిన వోట్లతో పూర్వులార్జించిన పేరుప్రతిష్టలు, సంపదయు, నంతస్థితమై పోవ, సంస్థానములప్పుల పాలుగాగ, స్వాభిమానమునకు దిలోదకములిచ్చి ప్రజాస్వామ్యములం బదతాడన మొనర్చుకీ -వీరాధిపతులిప్పుడొనర్చు విశ్వప్రయత్నముల నణచుటకు ప్రజాశక్తి విజృంభించవలసియున్నది.

నెల్లూరుమండలమున ఎన్నికలు సమీపించుచున్నవి. నిజముగ రైతులు తాత్కాలిక లాభమును వదలి తమ హక్కులను స్వేచ్ఛను కాపాడుకొనవలసియున్నది. ధనబలముచే జమీందారులు కొంతకాల మీపదవులకయి ప్రాకులాడగలరు. అంత మాత్రమున మనమునిరుత్సాహపడ నవసరములేదు. తమధర్మములను, బాధ్యతలను గుర్తించి రైతులుపోదరులీపరీక్షా సమయమున విజయముగాంచెదరుగాక!

## దేశిరెడ్డిశేషారెడ్డిగారికి బహిరంగలేఖ.

—::—

నెల్లూరు వెంకటాద్రినాయుడు.

—o—

రెడ్డిగారి స్థితిగతులతో మాకవసరములేదుగాని ప్రజాహిత జీవనమునకు సంబంధించినంత వరకు రెడ్డిగారి శ్రేయమునుగోరి కొన్నివిషయలగూర్చి ప్రజాలోకమునకు తెలియు నిమిత్తము ప్రశ్నింపక తప్పదు.

వెంకటగిరి రయితులకు జమీందారులకు ప్రారంభమైన పోరాటములో ప్రజాపక్షము వహింపక యే కారణముననో తాలూక పక్షమువహించి కొంతకాలము తనపక్షాభిప్రాయము వెలిబరచుటకై "స్వతంత్రరయితు" అనువారపత్రికను సాగించి నేడు అస్త్రసన్యాసము వహించిరి.

మీరు తనపత్రికలో ప్రకటించిన అభిప్రాయముల బట్టిన్ని, పెద్దలవద్దచెప్పిన అభిప్రాయములను బట్టిన్ని వెంకటగిరి యెస్టేటువారు రయితుల విషయములో చాలాసుముఖులుగ నున్నారనియు రయితు క్షేమము నకు యెన్నియో క్రొత్త మార్పుల ప్రవేశపెట్టనున్నారనియు మొదలగు విషయముల జెప్పియున్నారు.

యెస్టేటువారి యభిప్రాయములని రెడ్డిగారి ముఖత వెలువడిన వివరములు:—

1 సంఘముండుట తమకు సమ్మతమనియు క్రమమగు యెన్నికల మూలముననే సంఘసభ్యులు, సంఘాధికారులు నిర్ణయమండవలెననియు,

2 రయితు కష్టసుఖముల విచారించుటకు విచారణ సంఘముండుట అవసరమేననియు, అట్టి విచారణలో తమ యెస్టేటువారును పాల్గొందురని

## కొండలు కోనలు.

—:o:—

కొండలుకోనలకు పశువుల పోనివ్వవద్దని ఎస్టేటువారు చెప్పిరట. విషయము తెలుసుకొనను కొండలకు కోనలకు పశువులపోనివ్వక కొరత్తగా వుండవలసినది. ఈవలక్రంచెలలోనున్న అక్రమముగా యిస్టేటు వారున్న కొద్దికలోలంచెదల అర్హ్యంటిరపెట్టిక అవిషయము వెంటనే అధికారులకు తెలియపరచవలెనని కొండపల్లిక్కనాల గ్రామాముల రైతుల ప్రార్థించుచున్నాము.

ఇట్లు
నె॥ జి॥ జ॥రై॥ సం॥ కార్యదర్శి.

---

యు, విచారణసంఘువారు సూచించు సలహాలతాము అంగీకరింతుమనియు,

3 రయితు పరిపాలనలో సలహానిచ్చి సహాయపడుటకు స్టేటుకౌన్సిలు ఒకటిస్థాపింపబడునని యు ఆకౌన్సిలు సభ్యులుగూడ యెన్నికల ద్వారానే నిర్ణయింప బడుదురనియు,

మొదలగువిషయముల ప్రకటించి రయితుల నోరూరునట్లు చేసితిరి. అట్లుప్రకటించిన వెనుక రెడ్డిగారి మాటలనమ్మి వర్మ, పొరిలివారు రాణీ ఫరమ్సు జరిపి వెంకటగిరి జమీందారీ రయితు సంఘమును స్థాపింప వెంచిరి. అసంభవమని వాగ్దాన మొసగిన కుమారరాజాగారు చివరకు మొగించిరి.

పైన ప్రకటింపబడిన విషయములలో ఒకదానిని గూడ ఎస్టేటువారు నెరవేర్చక పోవుటయేగాక అసలు సంఘముండుటకె యిష్టములేదని బుజువైనది. సంఘములు నశింపచేయుటకు పైతము అహర్నిశము ఎస్టేటువారు ప్రయత్నించుచుండుట రెడ్డిగారెరుగనిది కాదు.

ఇట్టిపరిస్థితులలో రెడ్డిగారు యెస్టేటువారివాగ్దానముల మిషతో రయితులను ఇంకనూ నమ్మింతురా? లేక దీనియదార్థమును బైటపెట్టి యింకనయిన వెలిబడి రయితు సేవచేయుదురా?

రెడ్డిగారు రయితుసేవ చేయుటకు మంచిఅదనులభించినది. యెస్టేటువారు రయితులకు మేల్చుచేసెదమనునమ్మకములోడనే తామువారిపక్షమువహించిన కేవలమైనచో అట్టివాగ్దానము లన్నియుబూటకములయినప్పుడు రెడ్డిగారేల యింకను విడబడి రయితుసేవచేయుకూడదో సెలవివ్వకోరుచున్నాము.

వెంటనే రెడ్డిగారు పైవిషయముల యదార్థమును లోకమునకు ప్రకటించి అపవాదము బాపుకొందురుగాక యని ప్రార్థించుచున్నాము.

—o—

# విమర్శలు.

## కులతత్వము.

ఒక్కొకరు తమతప్పుల నితరులు బైట బెట్టినప్పుడు తామే వాటినితిప్పికొనుట లోకమున జూచుచున్నారము. నవంబరు 6.వ తేది "స్వతంత్ర" వాఖ్యలలో గత యెన్నికలలో రంగనాయకులుగారు కులతత్వ బీజములనిచ్చట చల్లుటకుప్రయత్నించి నట్లును చవిటిసేలలగుటచే మొలకలెత్తనట్లును వాకొనియున్నారు. కులతత్వమును ప్రచార మొనర్చినది రెడ్డిగారి ప్రచారకులని యింతలో మరచిరి కాబోలు? రెడ్లవద్దకు వెళ్ళి "రెడ్డికిపుట్టినవాడు రెడ్డికివోటివ్వండి" యని అవ్యక్త ప్రసంగముల జరిపిన రెడ్డిగారి అనుచరుల తప్పులకప్పిపుచ్చి రంగనాయకులగారిమీద మోపుట అనుచితమని చెప్పకతప్పదు. కమ్మవారు యేకొద్ది మందియో గలిగిన యీజిల్లాలో ఇట్టిప్రచారమునకు తావేలేదు. కాని యీకథయేదో ముందుహేతువునకు బైలువెడలినట్లు యూహించవలసియున్నది.

## స్వీకారము

"స్ట్రాగిటరు" ఇది నెల్లూరున ప్రతిసోమవారము ప్రకటింపబడు ఆంగ్లపత్రిక. దీనిప్రథమసంచిక మాకుచేరినది. దీనికి కార్యనిర్వాహక సంపాదకులు, సి. యస్. ఆర్. ఆంజనేయులుగారు. సంప్రతింపు సంపాదకులు, జార్జి జోసెఫ్‌గారు (ఎం. ఏ. బార్-ఎట్-లా) దీని సం॥ చందా రు 5 రు. వలయువారు నెల్లూరునకు పత్రికా నిర్వాహకులకు వ్రాసిన బడయగలరు.

---

## రంగనాయకులుగారి సంచారము

—o—

ఆచార్య రంగనాయకులుగారును నెల్లూరు వెంకట రామానాయుడుగారును ఈనెల 22 తేది వంగోలునుండి కారులో బైలుదేరి పొదిలిగుండా దర్శికిపోదురు. 23 తేది మొదలు 27 వ తేది వరకుదర్శి డివిజనులో సంచార మొనర్తురు. లోకల్ బోర్డులలో రైతు ప్రతినిధుల నెన్నుకొనవలసిన అవసరములనుగూర్చి రైతుల కుపన్యాసింతురు. 28, 29, 30 తేదిలలో వెంకటగిరి పల్లెలలో గూడా పైవిషయములనుగూర్చి సంచరింతురు.

మరికొందరు నాయకుల ప్రచారము.

బారిష్టరుగారును, శతావధానులు నగు శ్రీత్రిపురనేనిరామస్వామిచౌదరిగారును మరికొందరును ఈనెల తే 21 ది నుండియే దర్శి ప్రాంతమున ఎలెక్షను విషయమునప్రచార మొనర్తురని తెలియుచున్నది.

---

## బెదరింపులు.

—::—

పల్లూవారిపాళెం వెంచెలురెడ్డి (తాలూకాబోర్డురైతుసంఘఅధ్యక్ష) గారి ప్రచారకులు గొట్టికాడు గ్రామమునకు పోగా అప్పూరులో ఓట్లప్రచారముచేసినచో కొట్టెదనని గొట్టికాటి వెంకటస్వామిరెడ్డి బెదరించిరట, ఇదిగాక వెంచలు రెడ్డిగారి విషయమునను యిట్టిబెదరింపులు గలవని వదంతిగానున్నది. ఇదేకాలములో కుమారరాజాగారు పాలెసలోకి పిలిపించి ఓట్లనిప్పించవలని చెప్పినప్పుడు వెంచలురెడ్డిగారు యిష్టపడకపోగా "నాలాకష్టములనుభవించెదరు" అని సెలవిచ్చిరట. ఆబెదరింపులలోని భాగమేనా ఇది. ఇట్టివిషయముల అజాగ్రత్తపడక అధికారులకు తెలుపుట అవసరమని రెడ్డిగారికి సలహానిచ్చుచున్నాము.

(ఒక విలేఖరి)




## జమీందారులు—శాసనసభ.

రంగనాయకులు.

ఇప్పటికి పన్నెండుసంవత్సరముల క్రితమే, మదరాసు రాష్ట్రీయ ప్రభుత్వమందు, దాదాపు సగభాగము ప్రజాస్వామికము కావింపబడినది. ఈ ప్రజాయత్తమైన భాగమునకు, ముగ్గురు మంత్రులను ప్రధానాధికారులుగా నేర్పరచబడిరి. ఈ మంత్రులను, శాసనసభయందలి, అధిక సంఖ్యాకులకు జెందిన, రాచకీయ పక్షము వారే నిర్ణయించుచున్నారు. ఇవ్విధముగ 1920-26 మధ్య నేర్పడిన రెండుమంత్రాంగవర్గములకును శ్రీ పానుగల్లు రాజాగారును, 1926-30 మంత్రివర్గమునకు కుమారమంగలం జమీందారగు డాక్టరు సుబ్బరాయను గారును, క్రిందటిమాసములో నేర్పడిన మంత్రివర్గమునకు బొబ్బిలి రాజాగారును ప్రధానామాత్యులుగా నుండిరి. రాగాపోగా 1930-32 లోగల మంత్రివర్గమునకు మాత్రము, జమీందారుకానట్టి, సాధారణ రైతగు శ్రీ మునిస్వామినాయుడుగారు ప్రధాన మంత్రిగా యుండిరి. తదితర మంత్రులు, జమీందారులు కాకుండినను, శ్రీ మునిస్వామి నాయుడుగారిప్పుడు జమీందారుల నెదిరించుటకు తీర్మానించుకున్నను, క్రిందటి పుష్కరకాలమందంతట, జమీందారులకనుసన్నల గమనించి, జమీందారుల ప్రీత్యర్థమై, మంత్రివర్గములన్నియు, సర్వమగు ముఖ్య రాచకీయ ఆర్థిక వ్యవహారముల తీర్మానించుచుండిరనుట సత్య దూరము కాజాలదు.

ఇప్పటికిరువది వత్సరముల నుండి ఎస్టేటుల్యాండు ఆక్టును సవరించుట కత్యంతావసరము కల్గినప్పటికి, అధికారమందున్న ఏ యొక్క మంత్రివర్గముకాని, ప్రభుత్వముచే యీ యావసరకార్యమును నిర్వర్తించునట్లు చేయకుండుటకు కారణమేమి? అధిక భూములు కల్గినట్టియు, లక్షలకొలది సంవత్సరాదాయము పొందుచుండునట్టి జమీందారులపై భూమ్యాదాయపు శిస్తువేయవద్దని మదరాసుప్రభుత్వమువారు శిఫారసు చేయుట కెయ్యది కారణము? సహకారపరపతిసంఘములు, భూమితణఖాబ్యాంకులు జమీందారీభాగములందు స్థాపించబడుటకు తగినవసతులనుకల్గించకుండుట కెయ్యది కారణము? వివిధజల్లాలయందు స్థానికసంస్థలలో జమీందారులే పెత్తనముబొంది, సాధారణ రైతులను కండ్లుమూసి గంతలుకట్టుట కెయ్యదికారణము? దేవదాసీలశాసనము అమలులోనికి రాకుండుట కెయ్యదికారణము? జమీందారులకు, శాసనసభద్వారా మంత్రివర్గముపై సంపూర్ణాధికారముకల్గుటయేకదా? జమీందారులకు, సాధారణనియోజకవర్గములందే, అనేకసభ్యత్వములు, సులభముగాలభ్యపడుచున్నవి. వారితో సాధారణ రైతులు, వర్తకులు, రాచకీయజ్ఞులెన్నిపోటీపడి జయమందగలరు. ఇటులలభ్యమైనస్థానము లేకాక, భూస్వాములుకని ప్రత్యేకింపబడిన ఆరుస్థానములు వారికికలవు. మరియు ఎన్నికలయందు, తమతోచేరి తమపలుకుబడి ఎన్నికలనిధి వగైరాల పైయాధారపడినవారెందరో సభ్యులగుచుండుటచే జమీందారులకు స్వయముగాగాని, వారితాబేదారులు, పక్షీయులు, స్నేహితులద్వారాగాని, శాసనసభయందత్యంత ప్రాముఖ్యత లభ్యమగుచున్నది. తన్మూలమున, జస్టీసుపక్షమందేగాక, జాతీయపక్షమందును, జమీందారులకు పెత్తనము కల్గుచున్నది. శ్రీ మునిస్వామి నాయుడుగారు పెత్తనమందున్నప్పుడు జమీందారుల మాటకుజవదాటకల్గెనా? జాతీయపక్ష నాయకుడగు డాక్టరుసుబ్బరాయను జమీందారుకాడా? ఈవిధముగామదరాసుశాసనసభ, జమీందారుల చెల్లాటములకు, చదరంగములకు పుణ్యభూమియగుచున్నది.

ఇందులకు కారణమేమి? వోటరులందత్యధిక సంఖ్యాకులు రైతులును మధ్యతరగతి పట్టణవాసులు ఐనను రైతులింకను జమీందారుల మాయలనుండి విడివడుట లేదు. జమీందారీరైతులింకను జమీందారులకు దాసోహమనుట మానలేదు. సాధారణరైతులు, ధనవంతుల, బిరుదుగలవారిని, జమీందారుల ప్రేమించుట మానలేదు. ఎప్పుడు రైతులు సంఘీభావమొంది స్వతంత్రులై స్వసంఘోన్నతికై జమీందారు ధిక్కరింతురో, అప్పుడే రైతులకు శాసనసభయందు తగిన ప్రాధాన్యత కల్గును. జమీందారుల పెత్తనమును వేరులంటపెరికివేయవలెనన్న రైతులు ఆత్మగౌరబుద్ధికల్గి తమనాయకులనేనమ్మి, జమీందారుల ధిక్కరించి, రైతుసంఘాభివృద్ధికై, రైతులనే తమప్రతినిధులుగానెన్నుకొనవలెను. అప్పుడే ఎస్టేటుల్యాండుఆక్టు తగురీతి సవరణ బొందును. అప్పుడే రైతునకు సౌఖ్యము కల్గును. అప్పుడే గ్రామములు లక్ష్మీప్రదములగును.

---

## అధ్యక్షపదవి.

ఎలెక్షనే ఇంతవరకు జరుగక వెనుకకు పోవుచుండ జిల్లాబోర్డు అధ్యక్ష పదవికి అప్పుడే ముద్దుకృష్ణారెడ్డిగారు ప్రచారము ప్రారంభించినట్లు తెలియుచున్నది. ఎన్నికలు పూర్తియై అభ్యర్థులెవరో ఏర్పడి జిల్లా పరిస్థితులగూర్చి ఎల్లరును కూడి చర్చించి నిర్ణయించు కొనువరకు అభ్యర్థులెవరును వాగ్దానములొసగ రాదనియు అది సక్రమ పద్ధతిగూడ కాదనియు మనవిజేయుచున్నాము

# నెల్లూరు ఎలెక్షన్ మార్పులు

—o—

లోకల్ బోర్డుల గత ఎలెక్షన్ 1928 సం॥ మార్చి నెలలో జరిగినది. 1931సం॥ మార్చిలో క్రొత్త బోర్డులు వచ్చియుండవలసినది. కాని సర్కిల్ల విభాగము పూర్తిగాకను, కుమారరాజాగారి పక్షీయుల కుతంత్రములలో, దినమార్పులతో, కొంతకాలమును, ఎలక్టరల్ రోల్ తయారుగాక కొంతకాలమును ఆగినది. తర్వాత 1932సం॥ ఆగష్టు 21 తేది నామినేషనుకును, నవంబరు 22 తేది ఎలెక్షనుకును తేది నిర్ణయింపబడినది. ఏకారణముననో తేదిమారి నవంబరు 14 నామినేషనుకును, డిసెంబరు 12 తేది ఎలెక్షనునకును, తేదీనిర్ణయింపబడినది. నవంబరు 14 తేది నామినేషనులు జరిగినవి. అది మొదలు ఎలెక్షన్ తేదీమార్చబడునని వదంతులు ప్రబలినవి. నవంబరు 30 తేదినాటికి ఈవదంతి బలమైనది. డిసెంబరు 1 తేదినాటికి తేదిమారినట్లు కుమారరాజాగారి పక్షమువారును, రెడ్డిగారి పక్షమువారును స్పష్టముగ చెప్పసాగిరి. ఎలెక్షన్ ఆఫీసులో విచారించగా తమకేదియు తెలియదని చెప్పిరి. ఎలెక్షన్ ఆఫీసరుగారిని మదరాసునకు రప్పించబడెను. వారు మద్రాసునుండి వచ్చిన వెంటనే కొందరు అభ్యర్థులు దర్శించి అడుగగా తేదిమారినదనియు తిరుగా జనవరి 10 తేదికి వాయిదాపడినదనియు చెప్పిరి. మరికొందరితో అస్పష్టముగా చెప్పిరి. దినదినము పల్లెలనుండి ఎలెక్షన్ తేది కనుగొనుటకు వందలాదిజనము వచ్చిపోవుచుండిరి. యిదనిర్థమని తేలకుండెను.

కలెక్టరుగారిని గవర్నమెంటువారు అడుగగా తేదిమార్చిన తమకుయిబ్బందిగా నుండునని తెలిపినట్లును తెలిసినది. జిల్లాబోర్డువారు 5 తేదిన మద్రాసుకు టెలిగ్రాం యివ్వగా తేదిమార్చబడదని 6 తేది టెలిగ్రాము వచ్చినట్లుకూడ తెలిసినది. ప్రాంటపాలను అర్డరు వచ్చునని ప్రజలందరు మొగముచూచుచుండిరి. యీమాటలు నమ్మలేక కాలవ్యవధిలేక జిల్లాలోని టాక్సీకార్లు, బస్సులు, ఎలెక్షన్ ప్రచారమునకు మాటలాడబడి అడ్వాన్సులు యిచ్చి ఏర్పాటుచేసుకొనిరి. కొన్ని కారులు అభ్యర్థులు కొనిపోయి యిమారుమూలలనుంచుకొనిరి. అభ్యర్థులఏజెంట్లు ప్రయాణసన్నాహములతోనుండిరి. పోలింగుస్టేషనులకు బియ్యము, పప్పు, మంచినెయ్యి, వంటపాత్రల చేరవేసుకొనిరి. రాజాగారిపక్షమువారు మాత్రము సన్నాహములనేమి చేయలేదు.

7 తేదిఉదయం ప్రధానమంత్రి బొబ్బిలిరాజాగారు, కలకత్తా మేయిలులో మదరాసు వెళ్లుచుండిరి. వారినికలుసుకొనుటకు కుమారరాజాగారు వెంకటగిరిలోనుండి వైస్‌ప్రెసిడెంటుగారిని గూడూరులో నుంచిరి. వైస్‌ప్రెసిడెంటుగారు టెలిఫోనులద్వారా ఆమెయిలులో బొబ్బిలిరాజాగారు వస్తున్నట్లు బెజవాడనుండి ఫోనులో వర్తమానము సంపాదించి వెంకటగిరికి ఫోనులో తెలిపిరట. కుమారరాజాగారు కారులో గూడూరువచ్చి గూడూరు స్టేషనులో ప్రధానామాత్యుల బండిలోనెక్కి నాయుడుపేటవరకు వెళ్ళివారితో మాట్లాడిరి. వారుచెప్పుటలో కలెక్టరుగారు యిష్టపడినయెడల తాము తేది మార్తునని చెప్పినట్లు తెలిసినది. తర్వాత వైస్‌ప్రెసిడెంటుగారును, కుమారరాజాగారును కారులో నెల్లూరువచ్చి మహ్యాలిసాహెబ్ గారికి వకాల్తునిచ్చి వారిద్వారా కలెక్టరుగారిని చూచి వారిని సమ్మతిపరచిరట. అంతట వారు తమకుఆక్షేపణలేదని పైవారికి తెలిపిరట. 7-వ తేది సాయంత్రమువరకు టెలిగ్రాం రాలేదు. కుమారరాజాగారు 4 గంటలకు పయిన మద్రాసుకు టెలిగ్రామిచ్చిరట. బొబ్బిలిరాజాగారు కుమారరాజాగారికి ఆసాయంత్రమే తేదిమార్చినట్లు టెలిగ్రామిచ్చిరట. తర్వాత అధికారులకు ఉత్తర్వులు వచ్చెనట.

ఈవర్తమానము మారుమూలలకు చేరుటకు వ్యవధి చాలలేదు. కలెక్టరుగారు పోలింగు స్టేషనులకు వెళ్ళవలసిన తమ ఉద్యోగులందరికి ఉత్తర్వులనిచ్చి తరుముందే పంపివేసిరి. వీరందరికి వర్తమానములు చేరిన వెనుక తిరుగ రప్పింపబడిరి. యీయుద్యోగులు ఆయాసెంటర్లకు వెళ్ళి పోలింగు ఆఫీసర్లవద్ద సంజాయిషీలగొని తిరుగా తమ ఆఫీసులకు వచ్చుటకు ప్రభుత్వమువారికి యెంతసెలవయినదో తెలియదు. కాని అభ్యర్థులకు మాత్రము వారొక్కొకరికి రు 100/- లు వంతున కర్చులవేసుకొనినను రు 20000/- లకుపయిన కాబడినది. మారుమూలలకు అవ్యవధిగా వర్తమానముల చేరినను 15 రోజులుగా వినుచుండిన వార్తలబట్టి నమ్మజాలక అభ్యర్థులు చాలామంది నెల్లూరువచ్చి యథార్థముకనుగొని వెళ్ళిరి. యింతఅవ్యవధిగా తేదిమార్పించినందున ప్రజలలో గలిగిన అలజడికి మేరయే లేదు.

ఇదంతయు కుమారరాజాగారి ప్రచారము సరిగాసాగలేదనియు, కందుకూరు, కావలి, యెలక్షనులుగూడా ఒకేమాటు జరుగకున్న అధ్యక్ష యెన్నికలలో యిబ్బందికలుగుననియు, ఈపన్నాగము పన్నిరని తెలియుచున్నది.

పై విషయములబట్టి చూచినచో జమీందారుల పన్నాగములు యెంతటి బలకరముగనున్నవో, తెలియగలరు.

జమీందారుల సౌభాగ్య పరిపాలనమును జమీందారీరయితులేగాక తక్కిన వారందరును చవిజూచుభాగ్యము లభించుట అదృష్టమో, దురదృష్టమో చెప్పజాలకున్నాము.

మరియొకమాట యెలక్షన్ జనవరి 5-వ తేదినను, ఓట్లులెక్కించుట 7-వ తేదినను, క్రొత్తబోర్డుల అధ్యక్ష యెన్నికలు 22-వ తేదీలను జరుగునని తెలియుచున్నది.

వెంకటగిరి రాజాగారి యున్నత పాఠశాల.

# బడ్జెటు సమావేశము.

## ఉపాధ్యాయుల వేతనములగూర్చి పాలక వర్గమువారు చేయుచున్న యన్యాయములు.

(ఒకవిలేఖరి.)

పాలకవర్గ మొకటి రెండు రోజులలో సమావేశమగుచున్నది. సమావేశదినమున చేయు విషయములను చర్చింపవలయునో వానిని కాగితములమీద టైపులో వచ్చువేయించి పక్షము క్రిందటనే సభ్యుల కందరికి కార్యదర్శి పంపియున్నాడు. సభ్యులందరు యీలోగా వచ్చు తీర్మానముల విక్కిరించుకొని సమావేశమునాడు నిజాభిప్రాయములను వెల్లడించవలెనని కార్యదర్శి యుద్దేశము. ఆసమావేశము నాడే యున్నత పాఠశాలయొక్క సాంవత్సరిక ఆయవ్యయపట్టీనిగూడ (Budget) ప్రవేశపెట్టి, సభ్యులచే దానిని నామోదింపజేయుటకు కార్యదర్శి ప్రయత్నించును. ఇట్టి సందర్భమున పాఠకమహాశయులు తెలుసుకొనవలసిన విషయములేవన:—

(1) "ప్రధానోపాధ్యాయుడును, సీనియరు సహాయోపాధ్యాయు లందరును 1925 సంవత్సరాంతమునకే తమ గ్రేడును పూర్ణముగ బొందిరట. అట్లే బ్రాంచి స్కూలు యుపాధ్యాయులును తమ గ్రేడుల యంతమునకు వచ్చిరట. అయితే వీరికి 1930 ఏట అలవెన్సు రూపముగా వారి జీతములను హెచ్చించిరి. ఇట్లు గ్రేడుల యంతమునకు వెళ్ళిండ్లవారికే వచ్చిన యుపాధ్యాయుల జీతములవిషయమై సభ్యు లాలోచింపనున్నారట." ప్రపంచమంతయు ప్రపంచాద్భుత దుస్థితిపాలై యున్నది. ఇప్పుడు ప్రధానోపాధ్యాయుడు మాసమునకు రు. 175 ల చొప్పునను, సీనియరు సహాయోపాధ్యాయులు రు. 125 చొప్పునను వేతనములను బొందుచున్నారు. వీరందరి కష్టసుఖముల మేము బాగుగ నెరుగుదుము. బోధనాశక్తిలో సాధారణముగ నందరికన్న నెక్కువ జీతముల నిచ్చియును సంపాదించుటలేదు. వారికీజీతములు తగ్గింపబోవుటవలన నెక్కువ కాలుష్యమేగాక, యింకను మిగులును. పాఠశాలలోనే భూయముగ రండగను, ఒకరో భూయమైయున్నను, తక్కువ వేతనముల బొందుచు, కేవలము న్యాయముగా రావలసిన ఇంక్రిమెంట్లను బొందకయున్నట్టి యుపాధ్యాయులను గమనించి, వారికి చేయవలసిన మేలు ముందుగాలించినచో, సభ్యులెల్లరు పాయుల కృతజ్ఞతను బొందెదరు. అదియుగాక, పరిపమానముగా విద్యను బొందిన యుపాధ్యాయుల జీతములలో ప్రస్తుతముండు యవకతవకలను సవరింపవలెను.

(2) మనపాఠశాలయందు ప్రథమసహాయోపాధ్యాయునికి రు. 125 మొదలు ఏటా రు. 5 చొప్పున రు. 150 వరకు గ్రేడున్నది. ఈస్థానమును కీర్తిశేషులు శ్రీ. రంగాచార్యులుగారికొరకే నిర్మించిరి. వారియనుభవమును జూచియు, వారి ప్రజ్ఞను మెచ్చుకొనియు వారికే క్రొత్త గ్రేడును సృష్టించిరి. వారిప్పుడు దివంగతులైరి. వారియంతటి యనుభవము గలవారును, వారిలాగున నిజమైన పాఠశాల సేవను చేసినవారును యిప్పుడెవ్వరునులేరు. మన పాలకవర్గమువారు రాబోవు సమావేశములో ఈ ప్రథమ సహాయోపాధ్యాయపదవిని ప్రస్తుతద్వితీయునికి నివ్వవలసినది లేనిది తీర్మానింపబోవుచున్నారు. ఈడబ్బు లేనివాళ్ళలో యొకనికి నీగ్రేడు నిచ్చి యేల వ్యయమెక్కువ చేసుకొనవలయును? ఇప్పుడు ప్రత్యేకముగనుండు ప్రథమోపాధ్యాయపదవిని రద్దుపరచి, తక్కినవానితోబాటు కలిపివేసిన మంచిది. దీనిని సభ్యులెల్లరు గుర్తించి, ఈ త్తమమార్గము ననుసరింతురుగాక!

(3) ఇవన్నియు నిట్లుండ, ముఖ్యమైనవిషయమును విన్నవించక కాలయాపన చేసినందులకు మన్నింపుడు. ఆవిషయము జగత్ప్రసిద్ధులు, అద్వితీయ ప్రధానోపాధ్యాయుడు నైన శ్రీ దర్భల వెంకటసుబ్బయ్యగారికి సంబంధించినది. గురువాయూరు హరిజనులగూర్చి గాంధిగారు తలచినట్లు ఈ దర్భల వంశరాకాశశి (ఉపధాశుకలోపము లేదు సుమా) తన ప్రధానోపాధ్యాయత్వమును దక్కగా నెలవేల్చునా లేదా, శ్రీ సంతాన రామయ్యంగారి నదనంతరము బడియున్న వీధముల బాగుపడెనా, లేక యధోగతి పాలయ్యెనా, వీరి పదవికి సర్వ్హలా యసర్వ్హలా యను విషయమునుగూర్చి సింహపురి పౌరావతంసులలో నొక రెఫరెండమును (Referendum) పెట్టితిమేని, నిజము బయటపడగలదు. మొన్నటివరకు హెడ్మాష్టరుగ్గా క్రింద ఫాక్ సాహెబ్‌గారి పాలన వంటిదే వీరి పాలన కూడను. బ్రాంచి స్కూలు బజారున నున్నప్పుడు దాని నవీకరించి వీరికి రూ 20 ను యిచ్చెడివారు. బ్రాంచిస్కూలు తిప్పలన్నియు పడి, యథాస్థానము చేరిన తర్వాత, ఆ రూ 20 లను వీరికి మాన్పవలసివచ్చెను. కార్యదర్శిగారు మన ప్రధానోపాధ్యాయుని శ్లాఘించుచు, వారన్ని వర్షములు గావించిన సేవకు యీరూ 20 లను వారికెల్లప్పటికి నివ్వవలయునని సభ్యులందరికి సిఫారసు చేయుచున్నారు. కుర్చీలు, బల్లలు బాగులేవంటే, డబ్బు లేదనెడివారు, గ్రంథాలయమును చక్కచేయండీ యంటే, డబ్బు లేదనెడివారు, క్రొత్తవారికే (జూనియర్లకు) ఇంక్రిమెంట్లు నివ్వమంటే డబ్బు లేదనెడివారు, ఇప్పుడు రూ 175 లు నార్జించువారికి మాసమునకింకొక రూ 20 లు నివ్వనున్నారు. ఏమి యాలోచనలు, ఏమి తీర్మానములు. భళీ! ఇక దేనికి డబ్బు లేనిది, ప్రధానోపాధ్యాయునికిని, ద్వితీయ సహాయోపాధ్యాయునికి జీతములను హెచ్చుచేయ తలంచినప్పుడు దొరకినదేమో! ఇట్టున్నదిటి పరిపాలన-వారివని ఏమి ప్రయోజనము. వారినప్పట నుంచిన వారికి బుద్ధి తక్కువ. ఇన్నిరోజులకు వీరు చేసిన కృషి కొంచెమే అనుకొంటే దనగా బాలుర యాటలకై ప్రత్యేకముగ నుండు కార్యదర్శికి మాసమునకిచ్చు రూ 6 లు అలవెన్సు నివ్వకమానుట. ఏడాదికి రూ 72 లు, చాలచిన్న మొత్తమైనను, ఏదో కొంత వృధావ్యయము తగ్గిందన్నమాట. లేకపోతే యిందుకటు ఈ యనవసర వేతనము. మనబాలురు సంవత్సరమునకు డబ్బు నిట్టినను ఆగస్టు, సెప్టంబరు నెలలలోనే గదా ఖేలనరంగమందు గాన్పించుట! ఆ కార్యదర్శి గారెవ్వరో యొకరోజైనను ఖేలనరంగమందు మేము జూచుటలేదు. వారికిట్టి గౌరవ పదవు లికనెన్ని యున్నవో!

సభ్యులు చేయవలసిన దేమంటే, ఇటీవల జిల్లాబోర్డువారు చేసినట్లు, అసంతృప్తిని బొందిన వారి నందరి నితమలో తామేర్పరచుకొన్న యొక యుపసంఘమునకు అర్జీలను పెట్టుకొనియ్యవలెను. కొంతవ్యవధి నిచ్చి, మరియొకమారు సమావేశమయి, ఆయుపసంఘపువారి తీర్మానముల చొప్పున నెల్లరకు న్యాయమును కలుగజేసి, తన్మూలముగ మాఱునట్టి ఆయవ్యయపట్టీని మరల సవరించవలెను. ఆ యుపసంఘమందు సభ్యులు తమ బంధుమిత్రులనే గాక తక్కిన వారి దుర్దశను నిష్పక్షపాతముగ గుర్తించవలెను. ఇప్పుడు 100-5-125 గ్రేడున యంతమునకు వచ్చినవారి కెవ్వరికిని మరల జీతములను హెచ్చింపకుడు. క్రిందబడి కష్టములబడు వారిని క్రీగంటజూడుడు. పైచెప్పిన రీతిని, సభ్యులు తెలివితేటల నుపయోగించి వైద్యములని యనిపించుకొనక చక్కగ ప్రవర్తించెదరని విశ్వసించుచున్నాము.

---

కాని మెలక్షను తేదీలగాయితు అధ్యక్షయెన్నికలవరకు జిల్లాబోర్డు అధికారము జిల్లాకలెక్టరుగారిహస్తగతము కావలసియుండెను. ఈబోర్డు మాత్రము న్యాయదత్తులయిన వైస్‌ప్రెసిడెంటుగారి చేతినుండిమారకుండునట్లు ప్రత్యేక ఉత్తరువులు రాబడినవట. యెన్నికల తేద మారినవెంటనే యీఅధికారముగూడ తిరుగా పొడిగించబడినదట. ఇదంతయు జమీందారు మంత్రుల పరిపాలనా సౌష్ఠవమేగదా?

(ఒకవిలేఖరి.)

## నెల్లూరు డి॥ ము॥ కోర్టులో

S. C. S. No. 1336/1932

BETWEEN:—

దరిశి రంగయ్యగారు. వాది.

Special Receiver in I. P. 18/30. (District, Court) on the file of the Sub Court Nellore.

AND

1 బత్తుల నరసారెడ్డి } ప్రతి
5 శెట్టి సుందరరామిరెడ్డి } వాదులు

1.5 ప్రతివాదులకు ఇందువల్ల తెలియ చేయునదియేమనగా పై నెంబరున వాది రు 148-0-11 లు రాబట్టుకొనుటకు దావాదాఖల్ చేశియున్నాడు సదరు దావా విచారణనిమిత్తం తే 20-12-32 దికి వాయిదావేశియున్నారు. పై 1.5 ప్రతివాదులకు యేమైనా ఆక్షేపణలున్న యెడల వాయిదానాడు పగలు 10 గంటలక్కు కోర్టువారి యెదుట హాజరయివారికిగల ఆక్షేపణలను కోర్టువారికి. తెలుపుకోవలెను లేనియెడల ప్రతివాదులపరోక్షమందు విచారించితీరుమానించబడునని ఇందువల్ల తెలుపడమైనది.

30-11-32 N. SIVARAMAIAH,
*Pleader of plaintiff.*

## నెల్లూరు అడిషనల్ డిస్ట్రిక్టు మునసబు కోర్టులో

S. C. S. 1618/32.

నాతాన చెరుమాళ్ళశెట్టి } వాదులు
గునుపాటి వెంకటశేషయ్య }

షేకుకాశిషా సాహెబు—ప్రతివాది

యీవాదుల కంపెనిలో ప్రతివాది చేయుమానచ్చిన లావాదెవితాలూకు అంతకం తాలూకు చెల్లుపోను నిల్వ రు 129—1—10 లు రాబట్టుకొనుటకుగాను దావాచేయబడియున్నది. సదరు విషయమై ప్రతివాదికి ఆక్షేపణ యున్న యెడల 1932 సం॥ డిశెంబరునెల తే 20 ది పగలు 10 గంటలక్కు ఈకోర్టుకుహాజరై ఆక్షేపణ తెల్పుకోవలెను. లేనియెడల సదరు విషయం ప్రతివాది పరోక్షమున డిక్రీకాబడునని ఖండితముగా తెల్పుకొనేది

యం. యస్. రాఘవన్.

వాదివకీలు

## నెల్లూరు డి॥ ము॥ కోర్టులో

BETWEEN:—

O. S. No. 357/27 E. P. 1382/32

జక్కా శంకరమ్మ—వాది

కాకాణిశంకరరెడ్డి, వగైరాలు. ప్రతివాదులు

సదరు నెంబరులో ప్రతివాదులు వాదిపైన డిక్రీపొంది సదరు డిక్రీని వాదిపై అములు జరుపుటకుగాను ప్రతివాదులు యీకోర్టులో వారంటు దరఖాస్తుదాఖలు చేసియున్నారు. సదరుదరఖాస్తుపైన కోర్టువారు ఆక్షేపణకుగాను తే 19-12-1932 ది వాయిదావేశివున్నారు. ఆక్షేపణ వున్నవారు ఖుద్దునగాని లేక వకీలుద్వారాగాని హాజరయి ఆక్షేపణలు తెలుపుకొనవలసినది. లేనియెడల సదరు విషయం మీపరోక్షమందు విచారించి తీరుమానం చేయుదురని యిందువల్ల తెలియచేయడమైనది.

(Sd) బి. రామస్వామయ్య,
వాది అడ్వకేటు.




## వ్యవసాయకులపాలిటి వరప్రసాదిని.

హిందూదేశములోని నూటికి ఎనుబదిమంది కర్షకులుగానున్న ప్రజాసామాన్యముయొక్క పత్రిక. ఆంధ్రదేశములో గ్రామగ్రామములలోను, ఇంటింటను చాల్లబడుచుండు పత్రిక. వ్యవసాయము, పశుశాస్త్రము, గ్రామపునర్నిర్మాణము మొదలగు విషయములపై సమగ్రమగు వ్యాసములు, వ్యవసాయపు పాటలు, వ్యవసాయపు పంచాంగము, వ్యవసాయ పదార్థముల కొనుగోలు, అమ్మకము, మొదలగు వానిని గూర్చి కీలక సమాచారము తెలిసికొనుడు. లక్షల కొలది నోరులేని రైతులయొక్క కష్టనష్టములను ప్రకటించు కంఠధ్వని. పత్రికాస్తంభము వ్యాసములు, సంగ్రహవార్తలు, విద్యావిజ్ఞానములు ప్రజలచరిత్ర ప్రాథమికములు, ప్రజాసామాన్యమునకు తెలియుట కొరకయి మాతృభాషయందే ప్రకటించ గోరవలసి యీపత్రిక సాయపడగలదు.

ప్రతినెల 1-వ తేదిని, 15-వ తేదిని ప్రకటింపబడును సంవత్సరచందా రు 2—0—0 మాత్రమే.

ప్రకటనరేటుల వివరములకు కృషీవలుని ఆఫీసు మానేజరుకు వ్రాసి కనుక్కొనవలెను.

నెం. 6, లాయరు చిన్నతంబి మొదలివీధి,
సౌకారుపేట, మదరాసు.

---

## జమీన్ రైతు గీతాలు.

---

1. "మాకొద్దు జమీందార్లపొందు" అనేగీతము క్రయం. 0-0-6
2. చిలుకపాట 0-0-3
3. తుమ్మెదపాట 0-0-3
4. ఓటుపాట 0-0-3

వలయువారు వీపీక్రయము పోస్టుస్టాంపుల ద్వారాపంపిన పొందగలరు.

జమీందారీరైతుపత్రిక,
నెల్లూరు.

---





## జీవధన రక్షిణి.

పశువుల డాక్టరుగా చాలాకాలము పనిచేసి విశేష అనుభవమును సంపాదించి కీర్తిశేషులైన శ్రీయుత జి. రంగయ్య నాయునిగారిచే రచియింపబడిన యీ గ్రంథమునందు, పశువుల వ్యాధులను తెలుసుకొని స్వదేశ విధులతో చికిత్స చేయుటకు, సుస్తు, క్రియా విశేషములు, మానవవ్యాధులకు, సులభ చికిత్సలు గలవు. యివి 200 ప్రతులు మాత్రమే గలవు. వీనిలో 100 ప్రతులు ఆంధ్రగ్రంథాలయములకు ఉచితముగా యివ్వబడును. పోష్టేజికి గాను 0-5-0 పోస్టు బిళ్ళలు పంపవలెను. మిగత 100 ప్రతులు గ్రంథము 1-కి 1-4-0 నుండి 0-8-0 తగ్గించి 0-12-0 వంతున విక్రయించబడును. పోష్టేజి కొనువారు భరించవలెను. వలయువారు జీవధనరక్షిణి ఆఫీసు, గూడూరు, నెల్లూరు జిల్లా అను అడ్రసుకు వ్రాయవలెను.

జి. వి. చలపతినాయుడు.

## కందుకూరు, కావలి ఎలెక్షన్.

కందుకూరు. కావలి తాలూకాల లోకల్ బోర్డుల నామినేషన్లు డిసెంబరు తే 21 ది. స్క్రూటినీ తే 22 ది. నామినేషన్ల జాబితా ప్రకటించుట తే 24 ది. ఎలెక్షన్ జనవరి తే 5 దిన జరుగునని తెలియుచున్నది.

సంపాదకుడు, ముద్రాపకుడు, ప్రకాశకుడు, నెల్లూరు, వెంకట్రామానాయుడు, జమీందారీరైతు ముద్రాలయం, గాంధీచౌక్, నెల్లూరు.